గోలకొండపత్రిక

స్వభాను సం॥ర పుష్య శు॥ ౭ సోమవారము

# సామాన్య కిరాయదారుల కష్టములు

ఇప్పుడు జరుగుచున్న యుద్ధమువల్ల ప్రభుత్వములు అసాధారణాధికారముల నుపయోగించుకొని చర్యచేసినగాని తీరుటకు అవకాశములేని చిక్కులనేకములు సామాన్య స్థితిలోని జనులకు కలుగుచున్నవి. ఇట్టివాటిలో మొట్టమొదటిది ఆహారపదార్థముల ధరలు హెచ్చుటయు, సామాన్యముగా వారలుపయోగించు ఆహారపదార్థములను వారలు చాలినంత కొనలేకపోవుటయునై యున్నది. ఈ చిక్కును తొలగించుటకై ప్రభుత్వములు ఆహారపదార్థములను ఇంతకంటె ఎక్కువధరలకు అమ్మరాదనియు, ఒక్కొక్కనికి ఇంతకంటెఎక్కువ అమ్మరాదనియు నియమములను ఏర్పాటుచేయుచున్నారు. తర్వాతచిక్కు బట్టలధరలు హెచ్చుట. బట్టలకుకూడ ఫలానా ధరలకంటె మించి అమ్మరాదని శాసనములు చేయబడినవి. మందుల ధరలను కూడ ఇదేవిధముగ మట్టములో నుంచుటకు చర్యలు గైకొనబడినవి. ఈ విధముగ అన్నవస్త్రారోగ్యములను ముఖ్యాతిముఖ్యావసరములకు సంబంధించి యుద్ధపరిస్థితివల్లకలిగిన సంకటములను తొలగించుటకు అనేకములైన ఇతరదేశములలోవలెనే మనదేశమునందును అసాధారణాధికారముతో ప్రభుత్వమువారు చర్యగైకొనినారు.

అన్నవస్త్రములవెంటనే ముఖ్యమైన నివాసముల విషయమునకూడ ఇప్పుడు మన భారతదేశమందు అనేకములైన పెద్దపట్టణాలలో చిక్కులు కలుగుచున్నవి నగరములలో జనసమ్మర్దము ఎక్కువైనది. ఇప్పుడు క్రొత్తఇండ్లుకట్టించుటకు పూర్వముకంటె ఎక్కువ ఖర్చు చేయవలసియుండును. అందువల్ల క్రొత్తగాకట్టించిన ఇండ్ల కిరాయలు ఎక్కువగుచున్నవి. ఆ కిరాయలను చూచి కొంత, ఇండ్లకై తిరుగులాడు వారల సంఖ్యనుచూచి కొంత, ఇండ్లను కిరాయకిచ్చుకొనువారలు ప్రాత యిండ్లకును కిరాయలను హెచ్చించుచున్నారు. ఇందువల్ల సామాన్యులకు కష్టమగుచున్నది. అన్నవస్త్రాలధరలు హెచ్చి, ఇండ్లకిరాయలుకూడ హెచ్చినచో ఇక బ్రతుకుట ఎట్లు? ఇండ్లను కిరాయలకిచ్చువారలు తమయిండ్లలో ఇంతవరకున్నవారలు హెచ్చుకిరాయలనిచ్చుట కిష్టము లేనిచో కఠినముగా వెళ్ళిపొమ్మనుచున్నారు. నల్లాలను ఊడగొట్టుట, పాయిఖానాలను చెడగొట్టుట మున్నగు నిర్దయములైన చర్యలను చేయుచున్నారు. మన హైదరాబాదు నగరమునందు దేవిడీ బాగులో సుల్తానుబజారు ఆర్యసమాజమువారిచే కట్టించబడియున్న కిరాయయిండ్లలో ఇట్టి చర్యలు జరిగిన సంగతి గతసంచికలో ప్రకటితమైనది. ఇతరులకు ఆదర్శముగ నుండవలసిన ఆర్యసమాజముయొక్క అధికారులే ఇట్టి చర్యలకు దిగినపుడు, తక్కినవారలు ఇట్టిపద్ధతుల నవలంబించుచో ఆశ్చర్యమేమి? ఇపుడా దేవిడీ బాగు కిరాయయిండ్ల వారలు అధికారులతో మొరపెట్టుకొనుచున్నారు. ఈ సంచికలోనే వేరొకచోట గుల్బర్గనుండి శ్రీ డాక్టర్. బి. ఆర్. నాయక్ గారు పంపిన మొఱ యొకటి ప్రకటితమైయున్నది. ఇదేవిధముగ ఈ నగరమందును, ఇంకను ఇతరపట్టణములలోను ఇట్టి నివాస సంబంధములైన చిక్కులు ఇతరులకును కలుగుచుండవచ్చును. అట్లు చిక్కుపడుచున్నవారలందరును విడివిడిగా అధికారులవద్ద మొఱపెట్టుకొనుటవల్ల వారల కేవిధముగ న్యాయముకలుగగలదు? ప్రభుత్వమువారే నేరుగా ఇండ్లకిరాయలను న్యాయమైన ఒక పరిమితికంటె ఎక్కువచేయుట దండించదగిన అపరాధమగునట్లు అసాధారణ శాసనమొకదానిని చేయుట అవసరమని తోచుచున్నది.

బ్రిటిషిండియాలో మదరాసులోను, బొంబాయిలోను ప్రభుత్వములు ఇండ్లకిరాయలు అన్యాయముగా ఎక్కువకాకుండుటకు అసాధారణ శాసనములను చేసియున్నారు. మన ప్రభుత్వమువారును మనరాష్ట్రపు పట్టణములయందు ఈసమస్య ప్రతిమించకముందే న్యాయస్థితికి సంకటము కలుగకుండ, శాసనము చేయుట అత్యవసరము. అట్లు శాసనము చేయునపుడు పురపాలకసంఘములు ఇండ్ల పన్నులను హెచ్చించుటయు, దానివల్ల ఇండ్లయజమానులకు క్రొత్తభారము తగులుటయు మున్నగు అంశముల నన్నిటిని సమగ్రముగా ఆలోచించవచ్చును.

ఇండ్లకిరాయదారులకొక సూచన. ప్రతిపట్టణములోను ఇండ్లకిరాయదారు లందరికిని ప్రతినిధిగ కేంద్ర సంఘమున్ను, అవసరమైనచో వాడలయందు శాఖలును ఏర్పడి కిరాయదారులకు అన్యాయముగా కలుగుచుండెడి కష్టములను గురించియు, వారల న్యాయములైన అవసరములనుగురించియు తగినవిధముగ వ్యవహరించుటకు అలవాటు అగుటవల్ల చాల ప్రయోజనము కలుగగలదు.

## ఇండ్ల కిరాయల హెచ్చింపు బాధలు

మాకు హైదరాబాదు(దక్కన్)గుల్బర్గలో ౧౧౮—౨ నెంబరు భవనములో ఉండు దంతవైద్యుడు శ్రీ డాక్టరు బి. ఆర్. నాయక్ గారు ఇండ్లకిరాయలను హెచ్చించుటవల్ల ఈనగరములో కలుగుచున్న కష్టములనుగురించి ఒక లేఖను పంపినారు. ఇండ్లను కిరాయలకు ఇచ్చినవారు ఎక్కువ కిరాయలను కోరుచు, అట్లివ్వని వారలను వెంటనే తొలగించవలసినదనియు, తొందరగా తొలగనిచో నల్లాలను కోసివేసి బాధలు పెట్టుచున్నారని వారు వ్రాసినారు. ఇపుడు నగరంలో జనులు ఎక్కువగా నున్నారు. క్రొత్తయిండ్లు కట్టించుట కష్టము. కాబట్టి ఈ కష్టకాలంలో అన్నవస్త్రములవలెనే ఉండుట కిల్లుకూడ చాల ముఖ్యసమస్యయైనది

బ్రిటిషు ప్రభుత్వమున్ను కొన్ని ప్రసిద్ధభారతీయ సంస్థానాలును కిరాయదారులు అన్యాయముగా ఎక్కువయైన కిరాయలనుకోరి వెళ్ళగొట్టకుండ అసాధారణ శాసనములుచేసినారు. ౧౯౩౯కి ౧౯౩౯కంటె కిరాయలను ఎక్కువచేయరాదనినారు.

నావలెనే కిరాయల హెచ్చింపులచే బాధపడే వారలు నాకు తెలిపినయెడల పత్రికలలో మొఱపెట్టినను మంచిది— అని నాయక్ గారి సూచన

## వ్యవసాయపు సలహా స్థాయిసంఘము

### నిజాం ప్రభుత్వపు ఆదాయశాఖ మంత్రి ఉపన్యాసము

౧౯౪౩ డిసెంబరు ౨౧న తేదీన మ.ఘ.వ. నిజాం ప్రభుత్వమువారు క్రొత్త రాజ్యాంగసంస్కరణలననుసరించి ఏర్పాటుచేసియున్న వ్యవసాయపు సలహాస్థాయి సంఘముయొక్క సమావేశము జరిగినది. ఆసమావేశమందు వ్యవసాయశాఖ పరిపాలనపై కూడ అధికారముగల ఆదాయశాఖమంత్రిగారు ఆస్థాయిసంఘమునకు అధ్యక్షులుగనుక అధ్యక్షత వహించి ఉపన్యసించిరి, ఆఉపన్యాసములో ఈక్రింది విషయములు ముఖ్యములై యున్నవి:—

వ్యవసాయవిషయములలో పరిశోధన, ప్రచారము, పనిచేసి చూపించుట— వీటికి సంబంధించిన విధానములనుగురించి ప్రభుత్వమువారికి సలహానొసగుటయు, నేను ఈసంఘమువారికి తెలిపెడి వ్యవసాయసంబంధములైన ఏవిషయములలోగాని సంఘమువారి అభిప్రాయములను తెలుపుటయు, మీరు ఏవిషయముగాని చర్చించిన తరువాత దానినిమరొకసారి ఆలోచించవలెనని ప్రధానమంత్రిగారుమిమ్ము లనకోరినపుడువారికి ఆవిషయములో సలహానొసగుటయు— అనునవి ఈ సంఘము యొక్క పనులు మీలో ప్రభుత్వోద్యోగులు కాకుండవ్యవసాయకులైన వారున్నారు. అట్టివారలకు స్థానిక సమస్యలును, వ్యవసాయకులకష్టములును పరిచితములై యుండును. ఇక ఈసంఘములో ప్రభుత్వోద్యోగులైన సభ్యులుగలరే వారలకు మంచివిద్యయున్నది. కాబట్టి ఈవిధముగ రెండురకముల సభ్యులు కలిసియున్న ఈసంఘము ఆలోచించు ఏవిషయమునగాని వ్యవసాయకులకును, మొత్తము రాష్ట్రమునకును క్షేమకరములైన నిర్ణయములు కలుగునని నాకు ధైర్యమున్నది.

ఇప్పుడు ముఖ్యాతిముఖ్యమైన వ్యవసాయసమస్య ఏమనగా, భూమిలో తక్కువఖర్చులో ఎక్కువపంటను పండించవలెను, పండించినదానిని మంచిధరలకుఅమ్మించు ఏర్పాటుచేయవలెను. ఇందుకై నిజాం ప్రభుత్వమువారు పెద్దజలాశయములను నిర్మించుట, ప్రాతచెఱువులను బాగుచేయించుట, రాకపో కసౌకర్యములను వేగముగా ఎక్కువ చేయుట, వ్యవసాయపరిశోధనస్థలములను స్థాపించుట, తకావీలనిచ్చుట, విక్రయసౌకర్యములనుబాగుచేయుట, పంటలవిక్రయమునకుసౌకర్యములనుగురించి విచారణచేయుట, సహకారోద్యమమును వృద్ధిచేయుట మున్నగుప్రారంభించిచేసినారు, చేయుచున్నారు గ్రామజనులను అన్నివిధములఅభివృద్ధికితెచ్చుటకై ౧౩౫౦ఫసలీలో రూ ౫ లక్షలతో ఒక "గ్రామీణక్షేమనిధి" స్థాపితమైనది. ఆమొత్తముక్రమముగా లక్షలవరకు హెచ్చించబడగలదు, ఈనిధినుండిఖర్చుచేయుటకుఉద్దేశించుచున్న గ్రామప్రజలఅభివృద్ధికి సంబంధించిన ఆనేకముఖ్యప్రణాళికలు ఆలోచనలోనున్నవి.

వ్యవసాయశాఖవారు పరిశోధనలుచేసి ధాన్యములలో ఎక్కువపంటనిచ్చు క్రొత్తజాతులను సృష్టించివాడుకలోకి తెప్పించుచున్నారు. క్షామప్రదేశములలో మెట్ట వ్యవసాయమువల్ల ఎక్కువ ఫలితముపొందుమార్గముల నాలోచించుచున్నారు. ఆదాయశాఖ వ్యవసాయశాఖ, నిర్మాణశాఖలు కలిసి ౧౩౫౩ఫ. లో పాలములలో కట్టలనుకట్టించుటకు ప్రారంభించినారు. భూమినిబాగుచేయుటకును నీటిసరఫరాకును ఒకశాసనము చేయబడినది. నిజామాబాదులో పరిశీలనచేయుచున్న ద్వంద్వ సేద్యపుపద్ధతిని నాలుగుసూబాలలోను వ్యాపింపజేయు విషయమున మీసలహాకోరబడుచున్నది. పైరుల రోగములనుగురించి శోధనలు జరుగుచున్నవి. వ్యవసాయకులకు వ్యవసాయవిద్యనుచెప్పించు ఏర్పాట్లు చేయబడినవి.

వ్యవసాయ పరిశోధనశాఖయు, వ్యవసాయప్రచారశాఖనుండి విడదీయుటకు మంచిది కాదని నాఅభిప్రాయము.

ఇంతవరకు ప్రభుత్వశాఖలు చేసిన దంతయు వ్యవసాయాభివృద్ధికై చేయవలసిన పనుల ప్రారంభమాత్రమే వ్యవసాయకులు మంచి పద్ధతుల నవలంభించు జేయవలెనన్న కేవలము ప్రభుత్వోద్యోగులచేత కాదు.విదేశాలలో మంచి వ్యవసాయపద్ధతులను, పశువులమంచి పోషణమును వ్యవసాయకులలో ఎక్కువగాప్రచారము జేసినట్టి వ్యవసాయాభివృద్ధి సంఘాలుగాని, పశుపోషణ సంఘాలుగాని మనరాష్ట్రములలో జిల్లాలుగానితాలూకాలుగాని లేవు.ఇంతేకాదు పెద్దలో పయులరోగ్యశాఖవారుస్థానిక స్వపరిపాలనశాఖ సహకారముతో పుష్టికరమైన ఆహారమును గురించిపరిశీలన చేయుచున్నారు.వ్యవసాయ కార్యకర్తలకూడ సహకారముతుదిర్చి కార్మికులఆహారపుష్టిని ఎక్కువజేయవలెను.

ఇటీవల అమెరికా సంయుక్తరాజ్యములో ఆహార విషయములనుగురించి సంయుక్తజాతుల ప్రతినిధులు ఆలోచించిరి. వారలలో భారతదేశప్రతినిధియు ఉండెనట. వారలుఆహార ధాన్యములను ఎక్కువగపండించునట్లు చేయుటయును, ఆహారపదార్థములు తక్కువగుచో ఆలోపమునుసవరించుటకును ప్రస్తుతము చేయవలసిన దానినికూడ సూచించిరి. మిత్రమండలి దేశాలవారు తమతమ ప్రజల జీవనస్థితిని వృద్ధికితెచ్చుటకు, పంటల నెక్కువగ పండించునట్లు చేయుటకును ఆదేశాలన్నియు కలిసి ఒప్పుకొనదగిన ఒక ఒడంబడికనుఆసభవారు తయారుచేసిరి. ఈఒడంబడికకు నిజాం ప్రభుత్వమువారుబద్ధులై దబ్బులభించుకొంది ఇక్కడి పరిస్థితులకుతగినంత వరకు ఈఒడంబడికను ఆచరణలో నుంచగలరు.

౧౩౫౩ఫ.కి ప్రభుత్వమువారికి దొరకు ఆదాయములను,ఖర్చులనుగురించిన అంచనా లెక్కలలో మొత్తము రూ౧౩కోట్లు. దానిలో ౭కోట్లు భూమిపన్ను, కౌలుపన్ను, అబ్కారి, కరోడ్గిరి మున్నగు వాటివల్లరైతుల నుండివచ్చును. ఇందుకు గానువ్యవసాయానికై రూ౹౪లక్షల౩వేలు, పశుచికిత్సావ్యవసాయశాఖకై ౫లక్షల౫వేలు, సహకారశాఖకైరూ౹౬లక్షల ౫౩వేలుఖర్చు పద్దులు. ఈవిధముగా గ్రామములు పైసరియైనశ్రద్ధను వహించుటలేదు. ఈలోపము తొలగవలెను.

## అఖిలభారత హిందూ మహాసభ సమావేశము

అఖిలభారత హిందూమహాసభయొక్క రజతోత్సవ సమావేశమునకు కాసింబజారు మహారాజాగారు ప్రారంభోత్సవము జరిపినారు. ఈ మహారాజాగారి తండ్రిగారు పూర్వములో అఖిలభారత హిందూమహాసభకు అధ్యక్షులైయుండిరి. సమావేశమందిపుడు పూర్వమహాసభాధ్యక్షులు వచ్చిరి.

కాసింబజారు మహారాజాగారు తమ ప్రారంభోపన్యాసమును పూర్తిచేసినపిమ్మట, పూర్వపు అధ్యక్షుడగు రాజా నరేంద్రనాథ్ గారు హిందూమహాసభ మతపక్షపాత సంస్థగాదనియుజనులలో జాతీయతను ప్రబోధించుటకై వచ్చినట్టిదనియు చెప్పిరి.

వాదితర్వాత భాయీ పరమానంద్ గారును, డాక్టరు మూంజీగారు ఉపన్యసించిరి. వారుహిందువులు ఐకమత్యము కలిగియుండవలెననియు,భారతదేశము హిందువులకు సంబంధించినదనియు, దాని రాజ్యాంగము వేదముల ప్రకారము ఉండునట్లు చేయుటకై యత్నించుట విధాయనియు చెప్పిరి. మూంజీ గారు హిందువులు సైనికులుగా రవలెనని సూచించిరి.

డాక్టర్ ముఖర్జీగారి పంజాబు హిందూమహాసభకు సంబంధించిన వివిధశాఖలపక్షమున నేగాకనలువురు వ్యక్తులుకూడ కలిసి మొత్తమురూ ౩౦వేలు సమర్పించుకొనిరి. అమృతసర్ సూబాప్రోగ్రెస్ సంఘమువారు ఒక కత్తిని, వినతిపత్రమును సమర్పించుకొనిరి

హరిద్వారమునుండి కొందరు ప్రతినిధులు గంగాజలముగల ఒకయిత్తడిబిందెను తెచ్చి డాక్టర్ ముఖర్జీగారికి సమర్పించుకొనిరి. హిందూ—ముస్లిం—సిక్కు—లీగువారు డాక్టర్ముఖర్జీగారికి రూ౹౫౦౦ ఇచ్చిరి.

### బొలివియాలో తిరుగుబాటు

బొలివియాలో విప్లవకారులు తొలగించిన ప్రాతఅధ్యక్షుని చిలీరాజ్యమునకు పంపించివేసిరి. తమ క్రొత్త ప్రభుత్వము నేర్పాటుచేసికొనిరి. ఇపుడు ఈక్రొత్తప్రభుత్వమును కాలక్రోస్ కర్నల్ జోస్ టోరో గారు అధికారమును చేపట్టినారు.

### షష్టిపూర్తి

శ్రీయుత జూలూరు వెంకటేశంగారి షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున వరంగల్ వైదికకళాశాలకు ఒకయకరం భూదానము ౧౫౦రూపాయల విరాళమున్ను నొసగిరి. ఇట్టి ధార్మిక మహాశయులు చిరకాలము ప్రశంసనీయులేగాక మార్గదర్శకులుగా అయినందులకువారికి మేమెంతయో కృతజ్ఞులము.

ఇట్లు
వోలేటి లక్ష్మీనరసింహాచార్యులు

### గద్వాల "యువక విజ్ఞాన సమితి ప్రథమ వార్షికోత్సవము"

యువక విజ్ఞానాభివృద్ధికై స్థాపింపబడిన పై సమితి గత ౧౪ సంవత్సరమునుండి ఒక గ్రంథాలయము, ఉచిత పఠనాలయమును విద్వద్గద్వాల యందు విరాజిల్లుచున్నది.

జనవరి ౩,౪,౫ తేదీలందు పై సమితి వార్షికోత్సవము జరుపబడును.

## రెడ్డి హాస్టలు రజతోత్సవము

ఆర్మూరుతాలూకాలోని కొటకల్లి గ్రామము వారగు శ్రీయుత కేతిరెడ్డిహనుమంతరెడ్డిగారు ఇట్లు వ్రాసినారు.

"మేము రెడ్డిహాస్టలు హైదరాబాదురజతోత్సవమునకై చందావసూలుచేయుటకు నిజామాబాదు ఆర్మూరు తాలూకాలలో శ్రీయుత రామచంద్రారెడ్డి, శ్రీ సి.మాణిక్యరెడ్డి,శ్రీగోవిందరెడ్డిగార్ల సహాయమును పొందితిమి. విరాళములు ఈక్రిందివిధముగా లభించినవి.

శ్రీయుతులు: సత్యనారాయణరెడ్డి దూసగాము రు౹౧౫౦ నారాయణలింగారెడ్డిగారు వేలుపూరు, రు౹౧౫౦మాణిక్యరెడ్డిగారు కూరణపల్లిరు౹౧౦౦ కోలాగోవిందరెడ్డిగారు, జానకంపేట రు౹౧౦౦ నారాయణరెడ్డిగారు ఇల్లూపురము రు౹౧౦౦, వెంకటనర్సు రెడ్డిగారు ఇసపల్లి రు౹౧౦౦ గంగారెడ్డిగారు తిమ్మాపురము రు౹౨౫ రామారెడ్డిగారుగోరవరము రు౹౫౦ హనుమంతరెడ్డిగారుమురకపల్లి రు౹౫౦ రామరెడ్డిగారు మెంట్రాజపల్లి రు. ౫౦ నాగయ్యగారు అమ్మాపురము రు౹౫౦ గంగారెడ్డిగారు దేగాము రు ౫౦ చిన్నారెడ్డిగారు శ్రీరామపురమురు౹౫౦ నరసింహారెడ్డిగారు యూసంపల్లి రు ౫౦ గోవిందరెడ్డిగారు కొర్లకొండ రు౹౫౦ నరసింహారెడ్డిగారు అక్కులూరు రు౹౫౦, కృష్ణారెడ్డిగారు మోతె రూ౹౫౦ నారాయణరెడ్డిగారు దోనకంటి రు ౫౦ వెంకటరెడ్డిగారు సావెల రు౹౫౦ నరసింహారెడ్డిగారు వెల్లటూరు రు ౫౦ హనుమంతరెడ్డి వ నరసింహారెడ్డి గారు దొంకగట్టు రు౹౫౦ నరసింహారెడ్డిగారుచేపూరు రు౹౨౫ మొత్తము ౧౫౦౦. రూ॥

ఈ రాసున్న రజతోత్సవమునకు ఇంకను యెక్కువచందా వసూలుకాగలదు. యీయందుగుగుణిచియే శ్రీయుత కోదండరెడ్డి,రంగారెడ్డి నిజామాబాదుగారు శ్రద్ధవహించుటకు వాగ్దానము చేసియున్నారు. ఇంతవరకు దానములను గ్రహించిన దాతలకు నా కృతజ్ఞతా వందనములు"

## చెరసాలలో కలరాచే మరణము

గోపాల్ గంజ్ డిసెంబరు ౨౭

ఫరీద్పూరు సదరుజైలులో ధీరేంద్రనాథ విశ్వాస్ అను సెక్యూరిటీ ఖైదీ మరణించినాడు. ఆయనకు కలరావచ్చెను. పిమ్మట ౭ గంటలలోనే మరణించెను. విశ్వాస్ గారు జిల్లాకృషిప్రజాపార్టీయొక్క ఆర్గనైజింగ్ సెక్రటరీ అయియున్నారు.

## ఖమ్మంవార్తలు

### ఆంధ్రబాలికాపాఠశాల

(స్వ.వి.)

కీ॥శే॥ వేమునగంటి రామకృష్ణరావుగారి జ్ఞాపకార్థము వారిఅల్లుడు శ్రీఅధరాపురపు కృష్ణమూర్తిగారు సుమారు రూ ౨౫౦ విలువగల ఒకబీరువా,సైన్సు సామానులుంచుకొనుటకై దయచేయించిరి—

కీ॥శే॥ కల్యాల గోపాలకృష్ణయ్యగారి ఉత్తరక్రియల సందర్భమున వారికుమారులు శ్రీయుత రాజారామారావు వకీలుగారు రూ ౨౫ దెబ్బదియైదు రూపాయల రఖమును ఆంధ్రబాలికాపాఠశాలకు సమర్పించిరి.

### ఆహారకమిటీ- ఖమ్మం

ఖమ్మంమెట్టు ఆహారకమిటీ తేది ౨౭ డిసెంబరు సాయంత్రము శ్రీయుత కర్నాటి రామారావు వకీలుగారియింట దాదాపు౩గంటలకు ప్రారంభింపబడినది. కమిటీయొక్క ఉపాధ్యక్షులగు కీ॥శే॥ వేమనగంటి రాంకిషన్ రావు వకీలుగారికిని, శ్రీ పిల్లలమర్రి ప్రసాదుబహద్దురువారికుమారుల ఆకాలమరణమునకును తమసంతాపమును వెలిబుచ్చిరి.

ప్రభుత్వమువారిచే ప్రజల ఆహారసౌకర్యముల కొరకు బియ్యము జొన్నలు మొదలగుధాన్యముల ధరలు కంట్రోలు చేయబడుటచే, దానిననుసరించి మాగాఖమ్మంప్రజలకు ఆహారపదార్థములు అందగల పద్ధతులపై సుమారు రెండుగంటలు చర్చించి కొన్ని తీర్మానములు చేసుకొనిరి.

ఇంతవరకునడుపబడుచున్న చౌకడిపోలు అవసరము లేదనియూ, దానికొరకై ప్రజలనుండివసూలు చేయు ఆదాయము నిలుపుచేయవలయుననియూ తీర్మానించుకొనిరి.

## రాత్రి పాఠశాల

(స్వ. వి.) జనగాము బహమన్ ౧౫ కూడూరు గ్రామము జనగాము తాలూకాలో చేరినది. గ్రామములో ఒక సం॥ క్రిందట అక్కడి కొందరి ప్రముఖులచే బీదలగురించి రాత్రి పాఠశాల తెరువబడెను. అప్పటినుండియు వారల ప్రోద్బలముచే అభివృద్ధిలో నున్నది.

ఈ పాఠశాలను విద్యాశాఖవారు తమ రాత్రి పాఠశాల పట్టికలో చేర్చుకొని వారి పర్యటనలో పరీక్షగూడ చేసినారు. ఈమధ్య పోలీసు పటేలు గారిచే ఈ పాఠశాల సాగువిషయంలో కలిగినవని ఆరోపించిన ఆటంకాలనుగురించి విద్యాశాఖవారికి పోలీసు మదదుగార్కి పాఠశాల పక్షమునుండి మొర పెట్టుకొనబడినది.

---







## దక్కన్ మానవసేవా సమితిని బలపర్చుడు

హిందూమతము లేనిచోట సంఘముల కొరతవల్లను, ఉన్నచోట అమితసంఘములవల్లను, అభివృద్ధికి అధోగతిపాలగుచున్నది. మఖలో పుట్టి పుట్టలో గిట్టినసంస్థలకు లెక్కలేదు. ఐకమత్యమహాత్మ్యము గ్రహించకపోవడము, నూతనసంఘములు స్థాపించి గొప్పవాడుగా పరిగణింపబడుటకు ప్రాకులాడుటయు, మతాధికారులు గుప్తమును అర్థము చేసికొనకపోవడము యిందులకు మూలకారణములు. సకల రాజకీయసమస్యలను చర్చించి దేశసౌభాగ్యమును పెంపొందించు మహాసంస్థ కాంగ్రెసు యుండగా, దానికిపోటీగా యభివృద్ధి నిరోధకమైన కమ్యూనిస్టు పార్టీని బయలుదేరదీయుట ప్రత్యక్షనిదర్శనముగాదా?

“మానవసేవయే మాధవసేవ” యన్నారు పెద్దలు సమితి ఉద్దేశ్యములు ప్రచార కార్యవివరణచే ఆ సంస్థయొక్క యుత్కృష్టతను వేనోళ్ళ వెల్లడి చేయుచున్నది.

మానవసేవాసమితి సంకల్పించి, నిరంతరకృషి సల్పి, సాధించిన అహింసావిజయము మహత్తరమైనది. త్యాగమూర్తియైన బుద్ధభగవానుని గాంధీ మహాత్ముని జీవితలక్ష్యము అహింసయేగదా?

హిందూమతక్షీణతకు మార్గమైన, జాతులలో నొకటగు యెరుకలవారి పాఠశాల స్థాపనయు, హరిజనోద్ధరణయు ఈసమితిచేసిన ఆదర్శనీయ ఘనకార్యములు గావా!

సమితిప్రచారముచేతబోగముజాతిలో వివాహపద్ధతి చాలావరకు అమలుజరిగి, యెన్నియో కుటుంబములు బాగుపడినవనుటకు సందియములేదు. స్త్రీపునర్వివాహోద్యమము పౌర్ణమినాటి చంద్రునివలె దినదిన ప్రవర్ధమానమగుచు, నిర్విఘ్నముగ కొనసాగుచు సర్వసామాన్యమైనది.

ఒక బాల్యవివాహము మాత్రము కొంతవరకు నశించి యింకను చాలావరకు ఆచరింపబడుచుండుట చింతాకరము. హిందూమతములో విద్యావిహీనత, ఆరోగ్యబలక్షీణత, సంతానము అకాల మృత్యువులు, శిశు, బాలింతమరణములు, మితిమీరి మేధాశక్తి విజ్ఞానములు నామరూపములు లేకుండాపోవుటకు మూలకందమైన బాల్యవివాహములు మొదలంట నశింపజేయుటకు సర్వశక్తులు వినియోగింపవలసియున్నది.

శ్రీ యస్. శ్యామరావుగారు వ్రాసినటుల శ్రీ ఉప్పల కాశీశంకరుగారు యీవిషయములో (యితరవిషయములతోపాటు) ప్రశంసాపాత్రులైనారు.

ఇంతవరకు సమితికి సర్వవిధముల తోడ్పడుచు ప్రోత్సాహమొసంగుచున్న శ్రీ బద్దె జగదీశ్వరయ్యగారు శ్రీ బాలరాజయ్యగారు శ్రీ అనంతుల రంగపాండుగారు. శ్రీ రాజరత్నంగార్లు ప్రత్యేక శ్రద్ధ పుచ్చుకొని, మరల సంఘకార్యములు నూతనోత్సాహముతో కొనసాగింపుచు, సంస్థలను ఒకేచో నెలకొల్పి ఒక్కొక్క కార్యనిర్వహణమున కొక్కొక్క యుపసంఘమేర్పరచి సంస్థయొక్క ఆశయసాఫల్యముతోపాటు హిందూమతము ఉన్నతస్థానము అధిష్ఠింపజేసి లక్ష్యసిద్ధి నొందగోరుదురుగాక యని మనవి.

ఆకుల రాజయ్యగుప్త
తిరుమలగిరి బజారు-దక్కన్

---

## ఎన్నికలహడావిడిలో ఆంధ్రమహాసభ ఆశయాలు మరుగుపడుట

జిల్లాలలో ప్రతినిధుల ఎన్నికలు, మహాసభ అధ్యక్ష ఎన్నికలనుగురించి వివిధపార్టీలవారు తమ తమ ఆత్మస్తోత్ర పరీకారము సాగించుచున్నారు. కాని, ఆంధ్రమహాసభవారు ఇపుడుచేయవలసినపని ఏమి? ఆహారసమస్య ఇతరావసరముల వస్తువుల ధరలు తగ్గించుట, ఆహారపదార్థములు నిర్ణీతధరలకు అందరికీ లభింపజేయుట అధికోత్పత్తి మొదలగు క్లిష్టపరిస్థితులనెదుర్కొను చుకొత్తశాసనములను అధికారులు దుర్వినియోగపరచి, ప్రజలను బాధించకుండా సేవజేయువలసినబాధ్యత ఆంధ్రమహాసభ కార్యకర్తలపైన ఎంతేనికలదు. కావున ఈకార్యక్రమాన్ని నెరవేర్చవలెనన్న. ఎన్నికలు ఆపివేసి. కార్యనిర్వహణకై పూనుకొనవలయునని స్థాయిసంఘమువారిని కోరుచున్నాను.

సి. విశ్వనాధం
నల్లగొండ

---



## జనగామ తాలూకా రైతులపై నాగులభారము

జనగామ, బ ౧౨ది ౧౩౫౩ ఫ.

ఈతాలూకాలో వేరుశనగ ఉత్పత్తి పదిసంవత్సరములనుండి చాలా అభివృద్ధిచెందుచున్నది. ఈ జిల్లా మొత్తంలో సూర్యాపేట తాలూకా తర్వాత జనగామ తాలూకాలోనె ఎక్కువ వ్యాపకంలో వున్నది. ఇన్ని సం॥ నుండి పంటల అభివృద్ధిదశలో నున్న గ్రామాలలో వేరుశనగవిత్తనాలు అ౩/౩ భాగము. ఆ రైతులు పెట్టుబడిదారులమీద ఆధారపడువారే దీనినిబట్టి రైతులు ఎన్నిపంటలు పండించినా రైతుస్థితి విత్తనములు దామకొనుస్థితిలోగూడ లేరని స్పష్టపడుచున్నది

ఈవిత్తనములు ఎకరమునకు సాధారణముగా ౨౦ శేర్లు కావలసివుండును. ఇందుకై నాల్గుమణుగుల కాయ శేరుకాయపగులకొట్టి విత్తులుతీయవలయును విత్తనములకు సగటున (౭) ఏడురెట్లు ఫలించుచున్నది అంటె ఎకరమునకు (౨౦) మణుగులన్నమాట ఈ విధముగాపండినపంటను ఏడు భాగములలో ఒకభాగము అసలు విత్తనములకు ఒకభాగము నాగుఇవ్వవలసివుండును. మిగుతా అయిదు భాగములలో కాయచేనులో కల్పుకేయించుటకు తర్వాతకాయ భూమినుండిపీకుటకు తర్వాతచెట్టునుండి కాయవేరుచేయుటకు మొదలగునవి భరించవలసివుండును.

ఈతాలూకాగ్రామాలలో సేద్యముచేయు పెట్టుబడులలో ౧/౩ భాగము కొన్నిప్రాంతములలో, ౧/౪ భాగము కొన్ని ప్రాంతములలో, సేద్యముచేయబడి, విత్తనములఅవసరమును పైవిధముగా తెచ్చెదరు. రైతులలో ౨/౩ భాగము విత్తనములు నాగున తీసుకోవడమువల్ల ప్రతిగ్రామమునకు ౮౦ మొదలు ౧౦౦ పుట్లువరకు పెట్టుబడిదార్లవద్ద నుండి రైతులు విత్తనాలు తెచ్చితిరిగి పుట్టికిపుట్టి నాగుఇచ్చుకోవలసి వస్తున్నది.

ఆంధ్రజనసంఘము, తాలూకా కమిటీవారి ప్రచారముతల్లగూడెం గ్రామములో మూడుసం॥లనుండియు, యిప్పగూడెంలో రెండుసంవత్సరములనుండియు రైతులను పెట్టుబడిదారులను రాజీచేయించి ఒకటికి ఒకటిన్నర అనగా ఒకపుట్టికివిత్తనాలకు నాగుతోసహాపుట్టిన్నర నాగుమాత్రము తీసుకొనబడుచున్నది. కంచనపల్లిలో గూడ ఈ సంవత్సరము అటువంటిప్రయత్నము జరుగుచున్నది. ఈతాలూకాలోని మిగతాగ్రామాలలో ఒకటికి రెట్టింపు నాగుతోసహా తీసుకోబడుచున్నది.

ఈలాంటి క్రూరమైననాగులపద్ధతి రూపుమాపుటకై ఈసంవత్సరముకనీసం వేరుశనగవిత్తనముల నాగు అన్నిగ్రామాలలో ఒకటికిఒకటిన్నర నాగుతోసహా అయిన తీసుకొనునటుల చేయుటకు ప్రభుత్వాధికారులవిధియు మరియు ఇదియిరువదియవశతాబ్దమనుకొను హృదయముగల ప్రతిమానవునివిధియు అయ్యివున్నది.

ఇట్లు
సి. హెచ్. నారసింహ్మారెడ్డి,
తాలూకాసంఘ కార్యదర్శి.

---

## ధాన్యగ్రహణము వెల నిర్ణయము

దయామయులగు ప్రభుత్వమువారు రైతులవద్దనుంచి ధాన్యముగ్రహించి రైతుకుఇచ్చు వెలనిర్ణయించిరి. నాకు ౫౦ఏండ్ల వ్యవసాయానుభవముకలదు. దినుసుధర వ్యవసాయసామానులధర సమానముగ పెరుగుటతగ్గుచువచ్చినది సర్కారువారు నిర్ణయించిన ధరలు మేముచూచినవే! ఇదేధరలకాలములో ఇనుమును పావులకుమణుము ఇనుము. (కరులది) రూపాయిము పావలకు మణుము గడ్డపార, కమ్మిపట్టాలఇనుములభించేది. ఇనుములేనిది వ్యవసాయము నడువదు. కర్రుఇనుము ఏనిమిదిరూపాయిలకుమణుమైనది. గడ్డపారల ఇనుము (౧౫)రూపాయిలకు మణుముఅయినది. బండిచక్రములకమ్మి- పట్టాలు లభించుటలేదు. ఎన్నోబండ్లు మూలబడినాయి కొలదికాలములో తక్కినవిమూలబడగలవు.

ప్రస్తుతము సర్కారువారునిర్ణయించిన ధరలు గలకాలములో ఆరురూపాయిలకు ఒకదొడ్డుబట్టు ధానులభించేది (అరగజములది) రూపాయి అణాకు ఆరు గజాల ఫకీరుచాప్ బట్టలభించెని. ప్రస్తుతము గడ్డలధర చెప్పాలవిగాము.

మాకు ఏరోగమువచ్చిన గ్రామవైద్యుడే దిక్కు వారినాశ్రయింతు, తెచ్చుకులు తెస్తుము. శొంఠి, మిరియాలు,పిప్పళ్ళు మోడి, లవంగాలు మొదలగునవి తెమ్మందురు. ఆ టిధర విపరీతముగ పెరిగెను. రసగంధకములు ఆరోగ్యవస్తువులలో ఎక్కువ వాడుదురు. వాటిధర విపరీతముగ పెరిగినది.

కొనేకరానూనె, నాకూర్గ్రామస్థులకుచెందవు ఇకముందు ధనికులకే! ప్రభుత్వమువారు ప్రస్తుతము నిర్ణయించిన ధాన్యముధరలతో వ్యవసాయము నడుపుటకు సాధనములు, ఆరోగ్యవస్తువులు కొనలేక బాధపడి దివాలాతీసుకు కనుక [illegible] పూర్వముకంటెచౌకగ, ప్రభుత్వమువారు [illegible] కల్పించగలరని ప్రార్థన.

రైతులకత్యవసరమగు పశువులను చౌకధరలపై ప్రభుత్వమువారు ఇప్పించవలయును. ఈధరలనియామకమువిని రైతులగుండెలు భేలుమన్నది. రైతులు ప్రభుత్వమువారి వరప్రసాదమునకై ఎదురుచూచుచున్నారు.

ఈ దుర్భిక్షకాలములో రైతులకు జ్వరాలు, వ్యవసాయపశువులకు గాళ్ళు రైతులకష్టములు పరమాత్మునికే ఎరుక. మానిరిపిల్లితాలూకా అపరిమితమగుపన్నులచే పరితపించుచున్నది. ప్రభుత్వమువారు రైతులకష్టములు తొలగింతురని ప్రార్థన.

ఇట్లు
శింగిరెడ్డి వెంకటరెడ్డి, రైతు.

---

# రేషనింగువల్ల నష్ట మెవరికి?

## నష్ప్రచారము చేయువారు దొంగబజారు నాయకులే

### రేషనింగువల్ల రైతులకు, వర్తకులకు, ప్రజలకు కలుగు లాభము

"ఒక ప్రజాహితైషి"

ఈక్రింది కారణములవల్ల మ. ఘ. వ. శ్రీనిజాం ప్రభువారియొక్క రాజ్యములో ఆహారసమస్య విషమించినది:—

I సప్లయిపక్షము

౧. గడచిన రెండేండ్లలో రాయచూరు, గుల్బర్గా, మహబూబునగరము, నల్లగొండ జిల్లాలలో వర్షములు తక్కువ కురిసెను.

౨. రైతులు ఆహార దినుసులను పండించుట తగ్గించిరి.

౩. ఆహారదినుసులు దొంగతనముగా రాజ్యము బయటకు చేరవేయబడుట.

౪. ఆహారదినుసుల ధరలు కృత్రిమముగ హెచ్చించుటకై వర్తకులు, పెద్దరైతులు నిలువచేసియుంచుట.

౫. రాకపోకల సౌకర్యములేని ఇబ్బంది.

II గిరాకీపక్షము:

౧. యుద్ధకారణముచే ఎక్కువ కూలీలను ఆదాయములను పొందుచున్నవారు ఎక్కువగా తినుచుండుట.

౨. ధనికులగువారు ముందుగ ముందుధరలు హెచ్చునేమోయని ఆహారదినుసులను కొని నిలువచేయుట.

౩. మిలిటరీలో చేరినవారు ఎక్కువగా తినుచుండుట.

శ్రీనిజాం ప్రభుత్వమువారు ఇన్ని సంవత్సరములనుండియు ఆహారసమస్యను పరిశీలించుచున్నారు. ఇనుకటి తమ అనుభవమును, భారతీయ రాష్ట్రముల అనుభవమును, భారతీయ రాష్ట్రముల అనుభవమును దృష్టిలో నుంచుకొని బాగుగ ఆలోచించి ఈక్రింది ఏర్పాట్లు కావించిరి.

౧. ఆహారదినుసుల క్రిందనున్న భూమిని హెచ్చించుట.

౨. మార్కెటులోనికి ఆహారపదార్థములు వచ్చునట్లును, అవి అందరకును అభ్యమగునట్లును చేయుట.

౩. ఉన్న ఆహారదినుసులను తినువారిలో సరిసమానముగ పంచుట.

4. ధరల కంట్రోలు

ఈ ఏర్పాట్లు ఒకదానితో నొకటి లంకపడియున్నవి. ప్రజలకు ఆహారపదార్థములు సరిగా అందునట్లు చేసినప్పుడు ఎక్కువ ఆహారదినుసులను పండించుటయందలి ప్రయోజనము. అదికూడ ప్రజల అందుబాటులో ధరలుండవలెను. అందుచే ఉచితమగు ధరలకు నిత్యావసరములు ప్రజలకు లభించుట ప్రభుత్వమువారి ఉద్దేశ్యము. ఆహారదినుసుల ధరలు మంచి కట్టుదిట్టములుగ కంట్రోలు చేయబడినచో ఇతరవస్తువుల ధరలు కూడ వాటివలె దిగిపోవును. ప్రభుత్వమువారు ఒక్క ఆహారదినుసుల ధరలకేకాక గుడ్డ, గ్యాసు నూనె, చక్కెర, బెల్లము, నూనెలు, ఉప్పు, పత్తినములు, ఎరువులు, వ్యవసాయపు పనిముట్లకై కావలసిన ఇనుము మున్నగు వస్తువులధరలను కంట్రోలు చేయుచున్నారు.

పై ఏర్పాట్లను అమలులోపెట్టుటకై ఈక్రింది కార్యప్రణాళిక అనుసరించబడుచున్నది.

I ఆహారదినుసులక్రింది భూమిని హెచ్చించుట

౧. రైతులకు తక్కువధరలపై మంచివిత్తనములు ఎరువులు సప్లయిచేయుచుండుట.

౨. నీటిపారుదల సౌకర్యములు అధికముగ ఇచ్చుట.

౩. బంజరుభూములను వ్యవసాయము క్రిందకు తెచ్చుట.

౪. ఆహారదినుసులను పండించు రైతులకు మాల్గుజారీలో రియాయతులిచ్చుటయు, ధనసహాయము చేయుటయు

II మార్కెటులోనికి ఆహారదినుసులు వచ్చునట్లును అవి అందరకును అందుబాటులో ఉండునట్లును చేయుట

౧. దినుసులు నిలువచేయుటను నిరోధించుట.

౨. దొంగతనముగ సరుకు బైటకు చేరవేయకుండ చూచుట.

౩. ఇంతవరకు సరుకు దాచియుంచినవారి నిలువల లెక్కలు తీయుట.

౪. రైతుల దగ్గరనుండి కొంతకొంత ఫలసాయమును ప్రభుత్వమువారు సూటిగా కొనుట.

౫. మార్కెటులో హైదరాబాద్ కమర్షల్ కార్పొరేషన్ ద్వారా ప్రభుత్వమువారు కొనుట.

౬. రాకపోకల విషయములో ఆహార పదార్థములకు మొదటిస్థానమిచ్చుట

౭. ఆహారదినుసుల మొత్తములను, అవిఉన్న స్థలములను, అవి తీసుకొనిపోబడినస్థలములు మున్నగు వివరములు తెల్పునట్లు వర్తకులకును రైతులకును నిర్బంధ మొనర్పబడుట.

౮. ఆహార దినుసులమ్ము పెద్ద వర్తకులకును, చిన్నవర్తకులకును లైసెన్సులిచ్చుట.

౯. దాచియుంచబడిన నిలువలను తెలుపువారికి బహుమానములు.

III ఉన్న ఆహార దినుసులను తినువారిలో సరిసమానముగా పంచుట.

౧. పెద్దనగరములలో రేషనింగును అమలులోనికి తెచ్చుట.

౨. రాజ్యములో స్వేచ్ఛావ్యాపారము సాగనిచ్చుట. దానివలన ఎక్కువ ఆహార దినుసులు పండుచోట్లనుండి తక్కువ పంట ఉండు ప్రాంతములకు స్వేచ్ఛగాపోవుటకు దీనివల్ల అవకాశముండును.

IV ధరల కంట్రోలు

౧. బజారుధరలను నిర్ణయించుట.

౨. వర్తకులకు లైసెన్సులనిచ్చుట.

౩. రైతులదగ్గరనుండి సూటిగా కొనియు, హైదరాబాదు కమర్షల్ కార్పొరేషన్ ద్వారా కొనియు ప్రభుత్వమువారు నిలువచేసి బజారుధరలపై ప్రభావమువేయుట, నిలువచేసియుంచిన వారినిలువలు లెక్కలు వేయుట, తప్పుడు సమాచారము లిచ్చిన వారి నిలువలను స్వాధీనపరచుకొనుట.

౪. చెప్పినట్లువినని వర్తకులకు కఠినమగుశిక్షల నిచ్చుట. కంట్రోలుధరలకు ఆహారదినుసులను ఇవ్వకనిరాకరించు వర్తకులను కూడ శిక్షించుట.

దీనితరువాత ఈ ప్రశ్న అడుగవచ్చును. ఈ ఆహార విధానమును కఠినముగ అమలులో పెట్టినయెడల ఎవరికి నష్టము?

### దీనివల్ల లాభము పొందువారు

ఈప్రశ్నకు ప్రత్యుత్తర మిచ్చుటకు పూర్వము ఈఏర్పాట్లువల్ల ఎవరెవరికి లాభము కల్గునో చూచుట అవసరము.

౧. రైతు: దీనివల్ల రైతుకు లాభము, ఇప్పుడు ప్రభుత్వము, ప్రజలుకూడ రైతువంక తిరిగిచూచుచున్నారు. దేశముయొక్క ఆర్థికస్థితిలో రైతుయొక్క ప్రాముఖ్యతను ప్రభుత్వమువారు ఎప్పటికంటె ఎక్కువగ గ్రహించినారు. ఇట్లు గ్రహించుట రైతుకు శాశ్వతమగు లాభము. ఇప్పుడు రైతుకు సర్వసౌకర్యము లివ్వబడుచున్నవి. ధనసహాయము, నీటిపారుదల సౌకర్యములు, ఇతర సహాయము చేయబడుచున్నది. ప్రభుత్వమువారు కొను ఆహారదినుసులకు నగదుడబ్బివ్వబడుచున్నది. స్థానిక సాహుకారు కొంటే నగదు డబ్బివ్వడు. ప్రభుత్వమునకమ్మినను వర్తకునకమ్మినను రైతుకు ఒకేధరవచ్చునట్లు ఏర్పాటు చేయబడుచున్నది ధరలు నిర్ణయించుటలో ఎవ్వరికిని నష్టముకాకుండ చూడబడినది. ఇప్పుడు నిర్ణయించినధరలు యుద్ధపు పూర్వపుధరలకు రెండింతలుగానున్నవి. గుడ్డయు, పనిముట్లకు కావలసినఇనుమును తక్కువధరలకు సప్లయి చేయబడుచున్నవి. అంతేకాక కొంతవరకు సాహుకారులనుండి రైతుకు విడుదల లభించును. అన్నిటికంటె ఎక్కువగ, ప్రభుత్వముయొక్కయు కృతజ్ఞతలు రైతుకులభించును.

౨. ప్రజలు: ప్రజలకుకావలసిన ఆహారపదార్థములు తక్కువధరలపై లభించగలవు.

౩. వర్తకునకు: దాచియుంచనట్టియు, దొంగతనముగా పైరుకును బయటకుపంపనట్టియు, దొంగబజారులో వర్తకము చేయనట్టియు మంచివర్తకునకు న్యాయమైనలాభము కలుగును. ప్రజలయొక్క సద్భావనయు, ప్రభుత్వముయొక్క ప్రశంసయు అతనికిలభించును.

ఈవిధముగ ఆహారవిధానమువల్ల రైతునకును, వర్తకునకును, ప్రజలకునుకూడ లాభముకల్గును.

### నష్టమెవరికి?

ఈక్రిందివారికి మాత్రమే నష్టముకల్గును: దొంగతనముగా దాచియుంచు వారికి; దొంగతనముగా రాజ్యముబైటకి ఆహారదినుసులను చేరవేయువారికి; సరుకుదొంగతనముగ ఉంచి ప్రజలకు అమ్ముటకు నిరాకరించువారికిని; [illegible]







### ఆంధ్రమహాసభ

#### స్థాయిసంఘ ప్రకటన

##### ప్రాథమికసభ్యులు, స్థానిక కమిటీల ఎన్నికలు వగైరా

తేది 3-2-1353ఫ. జారీచేయబడిన సర్క్యులరు ద్వారా, ప్రాథమికసభ్యులను చేర్పించుటకై (30) బహమన్ తుదితేదిగాను, ఇతర ఎన్నికలకు తుదితేదీలు నిర్ణయింపబడియుండెను.

జిల్లాకమిటీల ఉపనియమాలు పరిశీలించు కమిటీచే ఆంగీకరింపబడి అన్నిజిల్లాలకు పంపుటకు బహమన్ 30 తేదివరకు కాలము పట్టినది. ఆ తరువాత జిల్లాకమిటీలకు; ఆయాస్థానిక కమిటీలకు ఉపనియమావళి ప్రకారము ప్రాథమిక సభ్యులను చేర్పించుటకును, కమిటీలను స్థాపించుటకును ఎన్నికొనుటకును వ్యవధి చాలిగాలేదని స్థానిక కమిటీల కార్యకర్తలు తెలిపిరి. వారు తెలుపుచున్న యదార్థమును గమనించి, తేదీలు మార్చుటకు నిర్ణయించనైనది. కావున ప్రాథమిక సభ్యులను చేర్పించు తుదితేది బహమన్ ఆఖరుకు బదులు [illegible] వరకు హెచ్చింపబడినది. ఆ ప్రకారముగ ఇతర ఎన్నికలన్నియు ఒకొక నెల చొప్పున హెచ్చింపబడినవి. ఈసర్క్యులరు ప్రకారము ప్రాథమిక సభ్యులను చేర్పించుట ను స్థానికకమిటీల స్థాపన, ఎన్నికలకును ఇతర ఎన్నికలకును ఇవ్వబడిన వ్యవధిని, ఉపయోగించుకొనవలసినదిగా [illegible] స్థానిక కమిటీల కార్యకర్తలతో కోరుచున్నాను

స్థాయిసంఘకార్యాలయము, తుర్రాబాజ్‌ఖాన్, హైదరాబాదు 28—3—1353ఫ. } [illegible] రామచంద్రరావు, డా. [illegible] రెడ్డి, కార్యదర్శులు

న్యాయమైన [illegible]

### నష్ప్రచారము [illegible] చవలెను

[illegible]

చందా వివరాలు
సంవత్సరము చందా ౬ హాలీ రూపాయిలు
ఆరునెలలకు ,, ౩-౧౦-౦ ,,
బ్రిటిష్ఇండియాలో సంవత్సరం చందా కల్దారు
విడి ప్రతిక ౦-౧-౩
పాత ప్రతిక వెల ప్రత్యేకము

# గోలకొండపత్రిక
# Golkonda Patrika

The only Popular Paper that reaches the masses in the Dominionns
BEST MEDIUM — FOR — ADVERTISEMENT

Vol. 18 — No 66 | Published on every Monday and Thursday· Hyderabad· Dn· | 3—1—1944




## ప్రజలను మెప్పించవలెను

ముస్లింలీగు మంత్రులకు
జిన్నాగారి సలహా

కరాచి డిసెంబరు ౨౯

ఇక్కడ ముస్లింలీగు మంత్రుల సమావేశము జరిగియుండెను. దానికివచ్చినట్టిముస్లింలీగుమంత్రులు జిన్నాగారిని కలిసిరి. జిన్నాగారు వారికి కొన్ని ఉదాహరణములైన సలహాలనిచ్చినట్లు తెలియుచున్నది. మొదట మంత్రివర్గముల ప్రతిష్ఠను వృద్ధి చేయవలెననియు, మంత్రుల సొంతప్రతిష్ఠలను అంత ప్రధానముగ చూచుకొనరాదనియు, ప్రజాసామాన్యమునకు మేలుచేయువిధానమునే అవలంబించవలెననియు, పక్షపాతములను చూపరాదనియు జిన్నాగారు వారలకు సలహానిచ్చినట్లు తెలియుచున్నది.

మంత్రుల సమావేశములో గవర్నరులుమంత్రివర్గముల పరిపాలనలో జోక్యముకలిగించుకొనుచుండెడి విషయముపై చాలఅసంతృప్తి తెలుపబడినది

ఇకముందు గవర్నరులు తమ ప్రత్యేకబాధ్యతను సంబంధించిన విషయాలలోతప్ప తక్కిన విషయాలలో మంత్రివర్గవిధానములకు అడ్డుతగులరాదనియు, మంత్రివర్గములో అందరుమంత్రులును ఒక్కొకట్టుగా పరిపాలన విషయములయందు బాధ్యులైయుండవలెననియు. మంత్రివర్గమందలి భిన్నపక్షములకు ఏకాభిప్రాయము కుదరని రాజకీయవివాద విషయములలో మాత్రము, అసంయుక్త బాధ్యతయును నిర్బంధమును సడలించవచ్చుననియు కొన్ని సంప్రదాయములను స్థాపనచేయుటకు సభవారు తీర్మానించుకొనినారు.

### రేషనింగు

హైదరాబాదునగరంలో రేషనింగు ఏర్పాటును ఫిబ్రవరినెలప్రారంభించువరకు చేయుగలరని కనపడుచున్నది.








Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad-Dn. Editor S. Prathap Reddy, B.A., B.L.